చ. పరువడి రాజసంఘములఁబట్టి కఠోరకుఠారధార
తోఁ, నిరువదియొక్కమాఱువధియించి భయంక
రతత్తనూత్కరో, త్సరదురురక్తపూరదివిషన్న
దిఁ బైతృకతర్పణంబు నిం, పరయఁగఁజేసి భార్గ
వతభాసిలితాగద రుక్మిణీపతీ. 38

ఉ. దేవతలుబ్బఁగాఁ బితృనిదేశమునన్ బహుజం
తుసంతతో, గ్రావనికేఁగి యందనుచరాయితవా
యుసుతుండవై లస,ద్రావణకుంభకర్ణముఖరాక్షు
సవీరవినాశనంబు స,ద్భావతఁజేసి రాఘువతభాసిలి
తాగద రుక్మిణీపతీ. 39

చ. హలహతిచేఁ గళిందతనయాపరిభేదనమాచరించి
దో, ర్బలమలరంగ దుష్టమతి బాలిశధేనుకము
ష్టికాసురా, విలయమొనర్చి లోకములవిశ్రుతిఁ
జెందినయోగ్రసాధనా, కలితకరుండవై బలతఁ
గాంచినదేవర రుక్మిణీపతీ. 40

ఉ. సుందరరూపతా త్రిపురసుందరులన్ వరియించి
బౌద్ధతన్, బొంది రయంబునన్ ద్రిపురపూర్వాసు
పర్వ్వాలఁజంపునప్పుడా,చందురుదాల్పుదేవరకుఁ
జాపశరాసనసాధనంబు లా, నందముమీఱఁగా
ననినొనర్చితివాగద రుక్మిణీపతీ. 41

చ. తురగమునెక్కి ఘోరతరదుష్కృతసాంద్రమలీ

మసంబునన్, తరతమతావిహీనభువి దార్కొని చే
త నసిన్ ధరించి సత్వరతఁ దుష్టసంతతిహాతం
బొనరించి బుధావనంబుచేఁ, బరగినకల్కిరూపము
న భాసిలుదేవర రుక్మిణీపతీ. 42

ఉ. మీఱుమనోజుమేనిపస మీఱుసొబంగులతీఱు
ముత్తెపుం, జేరుసదీడితవ్యమగుపేరు మతంగజ
చారుయానమున్, దూరు నొయారినెన్నడ; వి
ధున్ రుచిగేరుమొగంబు సౌరునున్, వారిజ
జాదిరతుగలవారుగదా హరి రుక్మిణీపతీ. 43

ఉ. వాసవుఁ డల్కమీఱి జడివాన మహాశనిసంయు
తంబుగాఁ, జేసిన గోపకుల్ భయముజెంది
పరుంగునునొందఁ గందుకా, భ్యాసకలీలఁ గేల
గిరివర్యముబూని సమస్తబంధుతన్, వేసటఁదీర్చి
కాచితిని వేగ జనార్దన రుక్మిణీపతీ. 44

ఉ. ఘోరదరిద్రతాభరవిఘూర్ణితమానసుఁడా కుచే
లుఁడా, దారివచింపఁగా భవదుదంచితపాదస
రోజచింతనా, గౌరవమొప్పఁగాచి పిటకంబులు
చేరెడుదెచ్చినన్ మహేంద్రోరుపరార్థసంపదల
నొందఁగఁజేసితి రుక్మిణీపతీ 45

ఉ. వేణునినాదవిశ్రుతిని వ్రేతలమానసముల్ హరిం
చి యా, జాణలఁ జిత్తభూపరవశత్వయుతాత్మ

లంజేయుచుఁ విని, ద్రాణమనోజకేళికల ర
జేసిన మీకథాసుధఁ, మానసపాత్ర
నియమంబుగ నానెద రుక్మిణీపతీ.

ఉ. ముద్దియలెల్ల మొల్లలిడ బుద్ధులుసెప్ప య
ఆోట ని,న్నొద్దికమీఁఅఁ గట్ట మదినోడక 
ని తెచ్చి దానిబ, ల్మద్దుల రెంటిమధ్యనుసమ
గల్చినవేల్పుపెద్ద నీ, సుద్దుల నెన్నరద్దు లజ
మహేశులు రుక్మిణీపతీ.

ఉ. నమ్మను నెమ్మనంబున ననాథజనావన నిన్ను మి
నిమ్మహి నన్యదైవముల నెన్న నమందమరంద
జా,లమ్మునవొప్పు నవ్యకమలంబున సమ్మదమొ
తుమ్మెదల్, క్రమ్ముకొనంగ నేర్చునె వికర్త
దున రుక్మిణీపతీ.

చ. కరమున పాదపద్మము ముఖంబునఁజేర్చి పం
వోధిని,ర్భరరమణీయలీల వటపత్రముపై 
నించి యోగమా, గ్గరతిని సర్వలోకతతిర
మందున జాగరూకతం, బరగినదేవదేవ నను
గుగ నేలుము రుక్మిణీపతీ.

ఉ. ద్రోణసుతప్రయుక్తఖరరోపముచే హతిన
కుంది ని, స్త్రాణకుఁడై జనన్యుదరసంగతుఁ
యభిమన్యుసూతి ని,ర్వాణఫలప్రదాత యద

న కృష్ణ ముకుంద యన్యనిన్, జాణతనంబునన్
వినుతిసల్పినఁ గాచితి రుక్మిణీపతీ. 50

ఉ. ప్రేతలచేలముల్ మిగులవేడుకప్రుచ్చిలితెచ్చి
వారి న, త్యాతతమానభంగమున నానతశీర్షలఁ
జేయుచున్ మనో, జాతనికేతనంబులకుఁ జాటు
గనుంచ కపాలమందునన్, జేతులుమోడ్ప వస్త్ర
ములు శీఘ్రత నిచ్చితి రుక్మిణీపతీ. 51

ఉ. చిన్నతనంబునన్ విసపుచేపునఁ బాలనొసంగు
పూతనన్, మన్నిగొనంగఁజేసితివి మద్దులఁగూల్చి
తి బండిసాకునన్, భిన్నముగాఁగఁదన్నితి వభీ
రుత నీచరితంబు నెన్నఁగాఁ, బన్నగభూషణుండ
యినఁ బొల్పడనేర్చునె రుక్మిణీపతీ. 52

. కొన్నిదినంబులజ్ఞతను గొన్నిదినంబులు శైశవం
బునన్, గొన్నిదినంబులంగనల కూరిమినిన్మఱి
కొంతకాల మత్యున్నతచింతచే వగలనొందుచు
నుందురుగాక నెన్నఁగా, నెన్నఁడు మీపదాబ్జ
ముల నెన్నరు మూర్ఖులు రుక్మిణీపతీ. 53

నీవెధనంబు బంధుఁడవునీవె సఖుండవునీవె తల్లి
యున్, నీవె గురుండు దాతయునునీవె శరణ్యుఁ
డవంచు నెమ్మదిన్, దేవరవారిపాదములు దిక్క
నినమ్మితి నింకనైన నన్, గావుము దేవదేవ హరి
కంజవిలోచన రుక్మిణీపతీ. 54

ఉ. బంధువులేమిచేయుదురు భార్యయుఁదల్లియు
ద్రిలైనను౯, బంధురసత్కృపామతి శుభ
మతేమియొనర్తు నుగ్రనీ, రంధ్రపరేతరాట
తదురాపదలొంద భవత్పదాబ్జసం, బంధమెత
వన్యసదుపాయముగల్గునె రుక్మిణీపతీ.

ఉ. పాణితలంబునందు మృదుభవ్యనినాదతరంగ
క్తమరా, వేణువువేణియందుఁ బరివీతములై
హాశిఖండముల్, నాకెపుముక్కుముత్తెము
బడ నందునిమందయందున౯, జాణతనంబు
అ రతిసల్పినదేవర రుక్మిణీపతీ.

ఉ. కందసమానగాత్ర పరకందఖనిత్ర మునీశకీర
కంద మురారి శౌరి హరి కందళితప్రథిత
భావుక, స్కందకుమారగీతయశకందర ర
గోసమూహ మా, కందము జూపు మీ
లకందఅకు౯ గతి రుక్మిణీపతీ.

ఉ. పంకజపత్రవారివిధి పారదభంగి నిరంతర
నా, తంకయుతంబునై వగలఁదాల్చుశరీర
త్యమం చెప౯, గొంకక మీపదస్మృతిని గొ
వారలకు౯ బరేతరా, టృంకరభీతిఁ జెందద
కృష్ణ మురాంతక రుక్మిణీపతీ.

ఉ. ఏమితపంబుచేసెనొ కరీశుఁడు నందుఁడు పూ

జన్మమం, దేమిమహావ్రతంబు జనులెంచఁగఁజేసి
నా గోపకాఘ మే, మేమియొనర్చినో యవి
యు నెన్నికఁజేయ విరించిశంభుసు, త్రాము లశ
క్యమే హారిణతామరసేక్షణ రుక్మిణీపతీ. 59

ఉ. శ్రీస్తనభూరిభూమిధరసీమల నంకలనుండి సత్వ
లో, కస్తవనీయవైభవముగాంచి ఘనత్వనిరూ
ఢినొందు కృ, ష్ణస్తనయిత్నుతల్లజమనక్ష సుఖజీ
వనమొందఁజేయు మో,కౌస్తుభరత్నజంభరిపుగా
ర్ముకశోభిత రుక్మిణీపతీ. 60

ఉ. మాధవ శౌరి శార్ఙ్గి వనమాలి మురారి మనో
జ్ఞహారిని, ర్బాధవిహారి చక్రి హరి భావుకశీలి ఘ
నాభమూర్తి పృథ్వీధరధారి పత్రిపతివీతి సుధీర
చితామితస్తుత, స్వాదుత ాకృతీ విబుధజాలకృ
తానతి రుక్మిణీపతీ. 61

ఉ. కొంకక కృష్ణకృష్ణ యనుకోరికకుక్క మతిబుట్టున
ట్లుగా, శంకయొకింతలేక మురశాసన! మీపదప
ద్మ మాత్మలో, నంకముగాఁగఁజేయ నిసితాంగ
తురంగుని దూరుచుందు!న, న్నింక భవత్పదసాద
మున నేలుము దేవర రుక్మిణీపతీ. 62

ఉ. బాలత నాయశోదచనుబాలు రయంబున నాను
చుక్క విలో,లాలకజాలమాంద్యమున కందమురీ

నంగ నూపసక్తజం, బాలముతోడ నందునిం
సము ముంగిట నాడుచుండుగో,పాలక వేప
రివగు బ్రహ్మమవీవవు రుక్మిణీపతీ.

ఉ. ఏకమతిన్ భవత్స్మరణ మెప్పుడుజేయక య
మందునన్, బైకొని కాలకింకరులుబాధలుపె
కాలమబ్బినన్, శోకమునొందినన్ గలదె చ
తబూని తుదిన్ నిబద్ధుఁడై, కాకలనొందనేమిం
గంజవిలోచన రుక్మిణీపతీ.

ఉ. బంధురసత్కృపామతిని బంకజలోచన మీఁ
బ్జసం,బంధినిజేసి నన్నితరబంధములన్ విడఁజే
మయ్యా! యీ,బంధనమేలనయ్యా!ఫలదాయక!
యక నీవెదిక్కొ యో, కంధరనీలవర్ణ ననుగావు
వేగమె రుక్మిణీపతీ.

ఉ. ఆడుచు గోపకామినులయంబరముల్ మఱపిం
కెచ్చి బల్, పోఁడిమిమీఱఁగా గుబురుపొ
లనెక్కిన దేవదేవ నన్, వేడుకమీఱఁగా నెపు
వీడకనేలుము పూర్ణతారకా, రాడమలా
కృష్ణ యదురాజశిఖామణి రుక్మిణీపతీ.

ఉ. అన్యులవేఁడఁ దావకపదాబ్జమె మాకిఁకఁ దో
వీడఁగా, ధన్యతనొందువాఁడ మిముదల్చుమం
త్మలవీడ దుష్టరా,జన్యులఁ జూడఁ గామ్యము

సౌఖ్యపుజాడలఁగూడ నన్నన, ద్ధన్యులకాపదం
బునిధి దాటఁగనోడవు రుక్మిణీపతీ. 67

ఉ. వేసటఁజెంది వేసములు వేయివిధంబులుగా నొన
ర్చుచున్, వీసముడబ్బుచొప్పనను విత్తముఁలన్
గడించినన్ దుదిన్, గాసును వెంటరాఁగలదె
కాండజనేత్ర గణించినన్ భవ, ద్భాసురపాద
భక్తి వసువారముగన్న రుక్మిణీపతీ. 68

చ. పిలిచినఁ బల్కవేవిటను బేఁలపాలిటిదైవగా
య నిన్, గొలచెద నింకన్యైన ననుగూరిమినే
లుము నేలవేసియున్, బలుచఁదనంబునీకు విదె
పొల్పడకుండునె లోకమందునన్, బలుచఁ మేల
నాపయిని పంకజలోచన రుక్మిణీపతీ 69

ఉ. సుందరఫాలమందిడిన చొక్కపుఁగస్తురిచుక్క
యందు నం,దందు నఁయాలలూఁగుచు నవంచిత
కాంతిని రావిరేక చె,న్నొందఁగ నందమందిరము
నొద్ద నమందముగా యశోదనా,నందముఁజెందఁ
జేయు యదునాయక కేశవ రుక్మిణీపతీ. 70

ఉ. ఆసలఁజెంది విత్తముల నన్యులకీయక యంత్యమం
దునన్, గాసునుజెందలేక నరకంబులనొంది తపిం
చుచుంద్రునీ,దాసులునై నిరంతరపదాబ్జయభక్తిఁ
జెలంగువారికిన్, వేసటలేల చెందుయదువీరశి
ఖామణి రుక్మిణీపతీ 71

ఉ. భూతికి ధాతవై స్థితివిధిత్వమునొందఁగ నచ్యు
తుండవై, ఘాతమునొంద రుద్రుఁడయి గణ్యత
నొందుసమస్తరూపునిన్, మాతరమానుతింపనిను
మాధవ నీపదపంకజద్వయిం, జేతులు మోడ్చి నింక
నను జేకొని కావుము రుక్మిణీపతీ. 72

చ. పరువులుగోఁ విత్తములపాలిటి యాసలనొంది
మోహనం, బ్రాణముచేత దిక్కుపడునర్థపునాడు
మదిన్ భవత్పదస్మరణముచే నిరంతరము సద్గతి
నొందఁగఁజేయుమయ్య యో, సురవరమానిజాతన
తశోభితపద్మగ రుక్మిణీపతీ. 73

చ. క్రతుశతముల్ మనోహరముగా నొనరించిన
సంతతంబు సు, వ్రతములొనర్చినన్ సురతరంగిణి
గాహన మాచరించినన్, గొతుకక మీపదంబు
లను గొల్చుటకున్ సమమౌనె యెన్నఁగా, నత
సురమానిజాల నిరుపమ్మితి నెమ్మది రుక్మిణీపతీ.

చ. సరసిజనేత్ర మీకథలు సైపక దుర్మతిదుర్గవీథి
దు, స్తరతరఘంటికారవము సల్పినరాక్షసవీరు
మున్ను సత్కరుణదలిర్ప నేలితివి కారుణికోత్తమ
తావకీనపత్స్మరణ మొనర్చువారలను సాకుట
కష్టమె రుక్మిణీపతీ. 75

ఉ. అష్టమిరోహిణీభమున నంచితలీలల రోహిణీసు
ద, త్యష్టమగర్భమందున రయంబమరన్ జనియిం

చి లో సం,తుష్టిగ దుష్టకంసు ననిదున్మి యు క్ర
పరాక్రమంబునన్,శిష్టజనావనం బెల సి నదే
వర రుక్మిణీపతీ. 76

ఉ. ధీరదయాసరిద్వర సుధీరచిత్తస్త వ మా త్తికా,
సారసితాంగ చారుతరసారసలోచన భక్తవా
రమం,దారధరాధరోద్ధరణ రి రా హేలన
క్రియా,పారగతాస్యమండల శుభంకర కేశవ రు.

ఉ. మీచరణంబులన్ మదిని మేలొదవన్ బచరించు
వాని న,గ్రాపవలేల చెందును బు వ లో
లోచనార్చిసం, దీపనమొ శికటులతిత్వ ం
బున గాక నిల్చునే, పాపవి కృష్ణ రి
పంకజలోచన రుక్మిణీపతీ. 78

ఉ. పాపము నొందువేళc బరిపంథిభయంబగు వేళ
భూరిఘో,రాపదలబ్బు వేళ వికచాంబుజలోచన
నీవు భక్తవత్సల, త్తాపములన్ మగల్ప నిరతం
బవనంబొనరింతువందురో,తాపసచిత్తగేహాయుది
తథ్యము సేయవె రుక్మిణీపతీ. 79

ఉ. ప్రాణభయంబు చేనయినc బాపసమాగమ చింత
నైన ని,స్త్రాణము చేతనైన సుకృతప్రతిపత్తిని
నైన సద్విని, ద్రాణమనంబుచే మిము నిరంతర
మెవ్వడు సంస్మరించు నా,బాణ భవత్పదాబ్జము
లచక్కి వసింపడె రుక్మిణీపతీ. 80

ఉ. బోటులతోడ నాటపరిపూర్ణవికాసముతోడ నా
డుదుఁ, జాటునకేగి కన్నుఁగవఁజక్కఁగఁగీటుచు
మాటిమాటికిన్, నీటుదలిర్ప గోపరమణీమణి
పంక్తుల వెన్నదొంగవై, బూటకమొంద దేవ
హరిపుణ్యపురాతన రుక్మిణీపతీ. 90

ఉ. మానవిన్ మదింగొనుము మామకసంస్తుతశీ
ల పూర్ణిమా, మారుచిరాస్య శౌరి హరి మామ
నవప్రదానలోల హే, మామలచేల కృష్ణ
యసమమానహితప్రథితప్రభావ మే, మా! మిము
సన్నుతింపఁగను; మామకదైవము రుక్మిణీపతీ. 91

ఉ. హార మనోజ్ఞసంవిదుపహార మదాంధసురారివా
ర సం,హార సమస్తహేయపరిహార విరించిపు
లోమజేశ మా, హారమణాశ్వసన్నుతవిహార
సుశోభితవత్సభాగ నీ, హారమయూఖవక్త్ర,హరి
యంచితనామక రుక్మిణీపతీ. 92

చ. పరుసముసోకి లోహము సువర్ణతఁజెందునటుల్
భవత్కథా,విరచితమైనపద్యమదివిశ్రుతమూఢజ
నోక్తమైననుఁ, సురుచిరమై చెలంగి పరిశుద్ధసు
వర్ణతఁ బొందకుండునే?, పరువడి వించినన్ వి
కచపంకజలోచన రుక్మిణీపతీ. 93

చ. పరమమునీంద్రవంద్యమురభంజన కృష్ణ హరీ ము
కుంద మం,దరధర దీనరక్షక సుధారసభాషణ

చంపకోత్పలా, ప్రరుచిరమాధురీభరితభావిత
భాసితసూనమాలికా, విరచిత పూజగైకొనుము
వేగ జనార్దన రుక్మిణీపతీ. 94

ఉ. కొందఱు నిర్గుణుండనుచుఁ గొంద ఱమేయగు
ణుండవంచు ని, న్నందరు నందు నిందు ననయం
బును నిశ్చితబుద్ధిలేనిమ,మ్మందఱయోగ్యమార్గము
ల నందఁగఁజేసి భవత్కృపాయులిల్, మందతఁ
బాపి బ్రోవుమ రమాధిప కేశవ రుక్మిణీపతీ. 95

ఉ. మాయనుగూడి లోక మనమాయన వైఖరిగూర్చి
యబ్బయ, మ్మాయనుమాయనుల్ వచనమా
యన మాయనయల్ మొనల్గర,మ్మాయను నాది
గాఁగఁబదమంజరియుల్ నిఖిలార్థజాతముల్,మా
యనె పెంచి యంతయును మాయఁగఁజేసిన దేవ
నీపయిల్,మాయనురక్తి నేర్పునుమా యని వేఁ
డెద రుక్మిణీపతీ. 96

ఉ. ఏమనియేర్పరింతు మది నేనునిపాడుదు యుష్మదీ
యమా, యామహిమంబుఁ గన్గొనఁగ నంబుజజ
న్మశచీపతీశము, శ్యామర రాజికేనిరు నగమ్యు
ము విస్తృతఘోరపాతక,స్తోమ మడంచి నన్ను
దయఁజూడుము కేశవ రుక్మిణీపతీ 97

ఉ. కృష్ణ ముకుంద శౌరి హరి కేశవ మాధవ వా
సుదేవ చం, ద్రోష్ణకరాంబకప్రకలితోరువిచిత్రచరి

త్ర భూరిరా, జిష్ణువిహార నందసుత సేవకరక్షక
దేవదేవ న, తృష్ణ సుమంగళాంగ హరి గిష్పతి
సన్నుత రుక్మిణీపతీ. 98

ఉ. గోపకగోపికాజనము గోపదరీతిభవాబ్ధి దాటఁగా
నోపికతో భజించుభువనోన్నతశోభనపావను
గ్నముకా, బాప తమఃపతంగకళ పాల్పడ మామక
మానసంబునకా, జూపఁగదయ్య యోభువనసుం
దరరూపక రుక్మిణీపతీ. 99

ఉ. యోగము లెన్నిదింట నవయోగము చెందఁగనీక
చక్రపం, యోగఫణీంద్రమస్తకము నూర్ధ్వముఁ
జేసి ఫణాసుధాప్తిచే, యోగఁగనీని దేహముల
నొప్పమునీంద్రులచిత్తవీథులఁ జా, రాగిలుపాదప
ద్మము శిరంబునఁ జేర్పుము రుక్మిణీపతీ. 100

ఉ. యాదవరాయ భక్తవర యాదవరాయనుపౌత్రుఁ
డజా దయా, శ్రీనగుణాభిరామజనశేఖరసుందర
సూరిపుత్రుఁడజా, మీ దయరావయోగియను మే
లగునామముగన్న నేను మీ, మీఁదగ చించుపద్య
ముల మేలుగనందుము రుక్మిణీపతీ. 101

రుక్మిణీపతిశతకము సంపూర్ణము.



# పీఠిక

ఈశతకము రచించినకవి శిష్టు సర్వశాస్త్రి. ఈయన సర్వకామదాదిమహాప్రబంధములు వ్రాసిన షడ్దర్శనీపారగులగు శ్రీశిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి కుమారుఁడు. వాసిష్ఠగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు. కాసలనాటి వైదికబ్రాహ్మణుఁడు.

శ్రీశిష్టు కృష్ణమూర్తికవి సంస్కృతాంధ్రములయందు బహుగ్రంథములను రచించి యాకాలమున సుప్రసిద్ధములై యున్న మాడుగుల, శ్రీకాళహస్తి, పిఠాపురము, కిర్లంపూడి లోనగు సంస్థానములయం దమితగౌరవసత్కారములు నంది యసదృశపాండిత్యమును ప్రజ్ఞావిశేషముచే దిగ్గజమువలె విజృంభించి వర్తించినటులఁ దెలియవచ్చుచున్నది. ప్రకృతశతకకర్తయు కృష్ణమూర్తిశాస్త్రిగారిపుత్రుఁడు నగు సర్వశాస్త్రిగారు తండ్రియంత లోకవిఖ్యాతవిద్వాంసులు కాకపోయినను ఉభయభాషలలో సరసమగు సాహిత్యము, అవధాననైపుణ్యము, గ్రంథరచనాప్రతిభ కలవారై కొంతకాలము కాళహస్తిసంస్థానాధీశ్వరులగు శ్రీదామెర వేంకటపతిరాజన్యుని యాస్థానమునం దాదరసత్కారముల నొందుచు నుండెను.

ఈజ్ఞానప్రసూనాంబికాశతకము కాళహస్తివారియాస్థానములో నున్నపుడు రచింపఁబడినదియే.

సర్వశాస్త్రి తనతండ్రిగారు గతించిన రెండుసంవత్సరములకు అనఁగా క్రీ॥ శ॥ 1872 సంవత్సరమునఁ గీర్తిశేషుఁడయ్యెను. ఈయనవ్రాసిన పుస్తకములలో జనాదరణపాత్రమైనది యమరుక ఆంధ్రీకరణము. ఇది చిరకాలముక్రింద ముద్రితమైనది. ఇపుడు ప్రతులు సైతము లభించుటలేదు. జ్ఞానప్రసూనాంబికాశతకము నిర్దుష్టముగ ధారాశోభితముగ నున్నది. కవి యుభయభాషలలో నిరంకుశుఁడనుట కిందలి పద్యములే తార్కాణము కాగలవు. తెలుగుభాషలో నిట్టి సర్వాంగసుందరములగు శతకములు చాల యరుదుగా నున్నవనుట సత్యదూరము కాదు. ఈశతకమును జక్కసంస్కరించి యీభక్తిరసశతకసంపుటమున కలంకారప్రాయముగఁ జేర్చితిమి.

ఇట్లు,

చెన్నపురి.
26-1-1926

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు
అండ్ సన్స్.

శ్రీరస్తు.

శ్రీ శిష్టు సర్వశాస్త్రికవిరచిత

# జ్ఞానప్రసూనాంబికాశతకము.

---

శా. శ్రీమద్దామరవేంకటక్షితిపతి క్షేమంకరప్రక్రి
యో, ద్దామాత్మీయదయారసప్రసరసిధ్యన్మంజు
లాపాంగవీ, క్షామందస్మితసుందరాస్యమెలమి
న్గన్పట్టఁ బ్రత్యక్షమై, సామంజస్యమెసంగఁబ్రోవు
ము ననున్ జ్ఞానప్రసూనాంబికా. 1

శా. శ్రీమాన్యంబగు కాళహస్తినగరీపీఠంబున న్సజ్జ
న, క్షేమప్రక్రియఁ గూర్చుచు న్సకలశక్తిస్తోమ
ము ల్గొల్వఁగో,లై వ్యామాన్యస్థితినున్న నిన్విడిచి నే
నన్యాశ్రయం బొల్ల నేఁ, సామాన్యంబుగఁ
జూడకమ్మ పుడమిన్ జ్ఞాన... 2

మ. దిగధీశుల్నినుఁ గొల్చి రక్కసులఁ ద్రోదిం దో
లి యాత్మప్రథా,నగతిం గాంచి సమస్తభాగ్యము
ల సన్మానంబులం బొంది రె, న్నఁగ వేమాట లిఁకే
ల యెంతయును నానావాంఛితార్థాప్తికై, జగతీ
సంతతి నిన్భజించునుగదా జ్ఞాన... 3

మ. పరమానందముతోడ నిన్ను మదిలో భావించి
సేవించి స, ద్వరముల్గాంచి యగస్త్యముఖ్యు
లహో వారాశ్యుపస్పృష్టన, స్ఫురణాదిం బ్రథఁ
జెందిరి శ్రీ గురుణాం జూతంగ మసాధదు, స్తర
దుష్ప్రాపములేలగల్లు జగతిన్ జ్ఞాన... 4

మ. ధరణిం గల్గినగొప్పగొప్పపదము ల్తత్తద్విశేషం
బులుం, బరికింప న్మది దోఁచె నేఁటికి నిను న్భా
వించి సేవింప నే, పురుషార్థంబుడు గల్గు నందు
ను మనస్ఫూర్తి న్వహింతు న్సదా, పరమార్థా
యక సత్కటాక్షకళికా జ్ఞాన... 5

మ. తరమే నీమహిమంబు లెన్నఁగ సద్భాగ్యంబు
లేకుండ న, వ్వరమామ్నాయములున్ లాలనుం గని
తలంప న్దుస్తరప్రక్రియన్, దిక్కై మించుపథం
బునం దగు నశీతిన్యాసము శ్రేయము భా, స్వర
మంత్రజ్ఞాలఁ బ్రోచితీర కవవే జ్ఞాన... 6

మ. కలుము ల్నిత్యము లంచు నమ్మి మదిలో గర్వించి
యుద్ధారుశీం, గలమూర్ధాత్ములు నిన్నుఁ గొంద
ఱు గనంగారాక నీసేవలం, దొలఁగింపం దలపో
సి దుర్గతులపొందుం జెందువారేకదా, జలజాత
ప్రతిమాననమానసకళా జ్ఞాన... 7

మ. అకలంకంబగు నీదుసేవకయి మాన్యామానమా

ణిక్యమా, క్తికపంకేరుహారాగ విద్రుమముఖాగ్రి
యోజ్జ్వలద్రత్నయు, క్తకరాంభోరుహాపాత్రికా
కలన నిత్యంబు న్నినుం గొల్వరా, సకలామర్త్య
సతీతతిం దనుపవే జ్ఞాన... 8

మ. చెలువ ల్మిన్నొకసారి చేరి యెలమిం న్సేవింప
సౌభాగ్యముం, దెలివి న్సంతతి నిత్యసంపదయుఁ
బాతివ్రత్యముం గల్గఁజేసి లసద్దివ్యదయాకటా
క్షముల వాసిం గూర్తు వంతంతకుఁ, జలజాతా
సనముఖ్యాద్రిపతసుతా! జ్ఞాన... 9

శా. ధైర్యశ్రీ వడి నాలుగొల్పి సతతోద్యద్భక్తి
యుక్తిజ్ఞనా, శ్చర్యప్రక్రమ మొప్ప మెప్పగను
బూజాప్రక్రియం గాంచి రైశ్వర్యప్రాప్తి
మదంబుఁ జెందక సదాసక్తి న్సముద్యత్తప,
శ్చర్యం బూనినవానిఁ బ్రోతువుగదా జ్ఞానప్రసూ
నాంబికా. 10

మ. లలితంబై తగునీమహామహిమ వాలాయంబు
వర్ణింపఁగాఁ, గలనా నేనని యూరకుండ కిపు
డీకావ్యంబు సేయంగ నిమ్ముల నేసెంచితి నీథ
రం బడరు పెంపుం జెంది యిందీవర, స్థలనాపాద
నలోచనద్వయకళా జ్ఞాన... 11

మ. చకితాత్మీయజనాంతరంగ భయసంసర్గాపనోదక్రి

గ్యాధికమందస్మిత సుందరాస్య హిమరుగ్దీప్తిప్ర
సాలంచిత, ప్రకటానర్ఘళసుప్రభావనిలసద్భవ్యా
కృతిశ్రీయుతా, సకలామర్త్యచయావనక్రమ
హితా జ్ఞాన... 12

మ. జయలక్ష్మీకరమైననీమహిమచే సంప్రాప్యము ల్సం
పదల్, భయము ల్ఘోరము లౌనటంచు మదిలో
భావించి నీసద్దయా, శ్రయముం గాంచి ప్రియా
ర్థము ల్గను టపేక్షం జేకిం జూడ భాచయని
ర్ధూతనభోంబుభృత్పటలికా జ్ఞాన... 13

శా. అత్యాలస్యముఁ జెంది నీభజనముం దాసక్తి
యింతైన సద్వృత్తానందము గల్గఁ జెంద కెపుడు
న్సత్సంగతిం గాంచకే, నిత్యం బందును సంసృతిం
దలఁచి మానిత్వంబుతో నుంటి నా, సత్యా
దిత్యనుతా దయ వైనువుమా జ్ఞాన... 14

మ. కలరా నీసరివేల్పు లీజగతిలోఁ గల్యాణకల్యా
త్మతన్, వెలయింపం దగువా రటంచు సరిగా
విజ్ఞానముంజెంది నే, వలనొప్ప న్భవదీయపాద
యుగళీవర్తిష్ణుధీవృత్తినై, చలనంబందకయుంటిఁ
బ్రోవఁగదవే జ్ఞాన.... 15

శా. మార్గంబు ల్పదివేలు లోకమున సన్మాన్యస్థితిం
జెందఁ దద్దుర్గాధ్వప్రతిపత్తిమాని విగళద్దోషా

లినై మించి స,ద్వర్గస్తుత్యతఁ గన్న నీభజనసల్పం
బూనితి న్నిత్యముఁ, స్వర్గాధ్యక్షునుతాంఘ్రి
ప్రోవఁగదవే జ్ఞాన... 16

మ. స్థిరకీర్తి న్వెలయంగఁ జేయు నియతశ్రేయోని
వాసిత్వముం, బరగంజేయు సువర్ణరత్నముఖసం
పల్లీలలం గూర్చు దు,స్తరదుఃఖంబులఁ బాయఁ
దోలి మఱి సంతానాసౌఖ్యంబులుఁ, సరవి
న్నించుచు మించు నీభజనమో జ్ఞాన... 17

శా. చిత్తాయత్తము లైనకోశములవాసిం గూర్చి
భక్తాళికిం, దత్తాదృగ్విభవంబుఁ జేర్చి రిపుల
న్దండింపఁగా నేర్చి దు,ర్వృత్తంబు ల్తొలఁగింపఁ
జేర్చి ఘనసంవిన్మార్గము న్దాల్చి నీ,సత్తం దెల్లము
సేసి ప్రోవఁగదవే జ్ఞాన... 18

శా. జంబాలంబును బోనిపాపముల నోజం దాఁకకుం
డంగ దూ,రంబై పోవఁగఁజేయ మెట్టునెడఁ
దీర్ఘంబై తగం జేయ శా,పంబు న్స్వస్తియుఁ
దక్షిణంబునని చూప న్నీదు శ్రీచక్రరా,జం
బర్చించు మహాత్ముఁ డోపునుగదా జ్ఞాన... 19

మ. ననవిల్తుం గనుమంటలో మిడుతకూనంబోలె
మండింపఁ జూ,చిన జేజేగమి గచ్చువిచ్చయి కడ
శ్రేసరంగఁ జెంత న్వసిం,చిన నీవంతనవంతలోఁ

శా. కైలాసాచలసీమసంగతలసత్కల్పద్రుమాకల్ప నీ
పాలీపాళివిహారకృన్మధుకరీ వ్యాహారవీణాకళా
లోలీభూతవితంద్రమంద్రరవవల్లోలంబ కేళీవనీ
జాలాక్రీడితకౌతుకాంచితమతీ జ్ఞాన... 25

మ. సరళం బైనమతంబుఁ జెంది నియమాసక్తాత్ములై
సంతతాంతరపూజాపరమాదరంబుఁ గనియుద్య
ద్భాఖవకజ్ఞాను లై, స్థిరయోగంబున నిన్నెకొల్చు
సుజనుల్ శ్రేయోవిశేషాప్తి హెచ్చ రమా
వాప్త నివాసు లై వెలయరే జ్ఞాన... 26

శా. నీవే సిద్ధివి నీవె బుద్ధి వనుచు న్నిర్వ్యాజభక్తి
క్రియాప్రావీణ్యంబున సంతతంబు నిను సంప్రా
ర్థించు ధీరు ల్సను, స్త్వావన్యుత్తమసిద్ధిబుద్ధికిలనా
వాప్తి న్రమావశ్యయోషావశ్యాదికలీలల న్వెల
యరే జ్ఞాన... 27

మ. నినుఁ జిత్తంబున సంస్మరించుచు నరణ్యానీసర
ణ్యంతరంబున నైనం జనువేళ వ్యాఘ్రచయ
ముం బోత్రివ్రజంబుం దర, తుని కాయంబును
సింహసంతతియు మ్రుచ్చు లోబ్బవఁగాఁ జేసి దా,
సనితాంతోన్నతిఁ జేయు దీవ కదవే జ్ఞాన... 28

శా. పారావారము నీఁదశక్య మని చెప్ప న్వచ్చు
ధాత్రీధరో, ద్ధారం బౌనని యెంచవచ్చు నటులన్

ధాత్రీస్థలీరేణువుల్, తారావారము లెక్కపెట్టఁ
గు లోఁ బర్కింప నీసత్కళా, స్ఫారశ్రీగరి
మల్ గణింపఁ దరమా జ్ఞాన... 29

మ. భవదీయాంఘ్రిసరోరుహద్వయమునం బ్రవ్యక్త
భంగి న్విహా, రకలాసక్తినుండి యెల్లెడల సర్వ
ప్రక్రియ ల్గాని యే, కనకం బయ్యె మదీయమ
త్యాలిని నింకం బ్రో ప్రమమ్మా జన, స్తవనీయో
న్నతిఁ గల్గఁజేసి యెపుడున్ జ్ఞాన... 30

శా. నీవే దిక్కని నీదుసన్నిధిని నే నిత్యంబు సేవార్థి
నై, భావం బన్యగతం బొనర్పక నశింపం జెంపు
దీపింప నం, భావింపం దగునమ్మ భవ్యమతి సంప
త్త్యాదుల న్నించి వాం, ఛావిభ్రాంతి నొనర్ప
నవ్వ రిఁక శ్రీజ్ఞాన.... 31

మ. నయమార్గంబున భూప్రజం దనుపఁగా న్యాయ
క్రియాసంగతిం, బ్రియసామంత మహాప్రధాన
హృదయప్రేమాతిరేకంబు నే, య యశోలక్ష్మి
దనర్పఁ జేయఁదగు నీయర్బుల్ ప్రభుశ్రేణికు, చ్ఛ్రి
యసంధానసమేధమానకరుణా జ్ఞాన... 32

మ. వెనకయ్య న్వలచేత డావలికయి న్వెక్కయ్య
వెక్కయ్య లా, లవలం బుజ్జన మొప్ప నిప్రుడు
మదాలస్యంబున న్నిల్పు నీ, వెనుకై యామర

సుందరు ల్నిలిచి తీవిం గన్గొనం గంటి వి, చ్చున
నుం దాదృశరీతిః బ్రోవగదవే జ్ఞాన... 83

శా. నీనామం బొకసారి నెమ్మనమున న్నెక్కొల్పిన న్బ్రా
జస, న్మానంబు న్నిగమాగమో క్తిపదవీ నానార్థ
నిశ్చాయక, త్వ్యానూనప్రతిభావిశేషమును నిత్యం
బేకదా భ క్తదుర్, జ్ఞానోచ్చాటనపాటవస్ఫుటక
థా జ్ఞాన... 84

శా. సారంబైన భవద్దయారసమున న్సాధింపఁగా
నచ్చు దు,ర్వారారాతినికాయమున్సకలసంపల్లీల
లు న్మున్నుగాఁ, జేరన్ హెచ్చఁగవచ్చు నేరికయి
నన్ శ్రీకాళహస్తీశ యో, సారత్నంబ మహాబ
శాంభవినుతా జ్ఞాన.... 85

మ. ప్రసరచ్ఛీతలతావిశేషముల సంపాదించుచు న్నె
ఱురా, త్రిసతీశాంశము నాదల న్నిలిపియుం
డెం పేదుతాపంబునన్, వినవున్మేఁతరి సీదు మావి
రసము న్వేమాఱుఁ గ్రోలంగఁ దా,నపిగా విల్చె
ను సర్వలోకవినుతా జ్ఞాన... 86

శా. లీనప్రజ్ఞలకుం బ్రకృష్టధిషణాలీలావిశేషా ప్తి
య, న్వ్యానో క్తిప్రథమానశాస్త్రపదవీ ప్రోజ్జ్వలం
భమాణప్రథా, ధీనశ్లాఘ్యవదాన్యత్వమును
సంధిల్లుంగదా తావకా, ర్చానిష్ఠాగరిమంబు
గల్గుకతనన్ జ్ఞాన... 87

మ. నిరతి న్శ్రీపదపద్మపూజనవిధానిష్ణాతుఁడై సంత
తం, బరసాన్యాయపరాఙ్గనాదరములో నల్పం
బుగా నైనఁ జొ,న్పరహింఁ జూపక యేకభక్తి
నిను లోన న్నిల్పువాఁ డీచరా, చరసంపూర్ణజ
గత్పతి న్మిగులు నో జ్ఞాన... 38

శా. పంచాస్త్రుండు త్వదీయసన్నిధిని నీభక్తుం బ్రియ
త్నంబులోఁ, బంచాస్త్రుం బెదరింపఁబోయి త్రుటి
లో భస్మంబు దానయ్యె న, న్నంచే యింతలు
పుట్టె నంచు దయఁ బద్యోగంబునం గన్గొనం,
బంచద్దర్పకకోటి నింపితి వహో జ్ఞాన... 39

శా. పారావారసుతాదిలేఖసుదతీ పారంపరీగీతికా,
పారానంద పురంధ్రివర్గనియత ప్రాంచద్వివా
హాంగణో, దారామోదయుతాత్మబాంధవసతీత
త్యాశ్రితస్వాంతిక, స్ఫారాచారకృతిప్రమోద
భరితా జ్ఞాన... 40

శా. ఆసా మిక్కిలి గగ్గి యున్నది మహాహంకార
మా మెండు వి, శ్వాసం బెందును లేదు పూర్ణ
ము నృశంసత్వంబు సత్యార్థవి, న్యాసం బన్నది
వాసె నిట్టిజడుని న్నను బ్రోవఁగాఁ ద్వత్కృపా,
శ్వాసం బొక్కటి దక్క వేఱుగలదే జ్ఞాన... 41

శా. విశ్వాతీతపరాక్రమక్రమ సమావిర్భూతనిత్య

ప్రథా,వైశ్వర్యాహమికావిశృంఖలవిహారాత్యం
తభీతద్యుప, ద్విశ్వాస్యేతరచండఖండనదిశా
విశ్రాంతజన్యప్రథా, శశ్వద్విప్రతశక్తి నీవక
దవే జ్ఞాన... 42

మ. ఫల మొక్కింతయు నీని వేల్పుల భజింపన్ దాన
నేమా నటం, చెలమి న్నిన్నె సముగ్రభక్తిపథ
సాహిత్యంబుతోఁ గొల్వని, చ్చులు నన్నుం గన
కున్న నెవ్వారిఁక శశ్వల్లీలఁ బోషింప ని, శ్చలకా
రుణ్యకటాక్షవైభవయుతా జ్ఞాన... 43

శా. శోణాంభోరుహజైత్ర పాదయుగళీశోభాకృదు
ద్యన్మణి, శ్రేణీహంసకమంజుగుంజితసమాకృష్టావ
దాతచ్ఛద, క్వాణాకర్ణనమోదమాన హృదయా
గచ్ఛద్వ్యపత్కిన్నర, స్త్రైణాలోకనహృద్యసుం
దరగతీ జ్ఞాన... 44

మ. నును మైచాయలు దాసనంపునన చెన్నుం బూని
మిన్నందఁ గ్రొ,న్ననయమ్ముం గొని తుంటవింట
నెలమిన్నుం టొప్పఁగాఁ జేసియుం,పునముల్లోకము
గెల్చు వశ్యముఖివై పొల్పొందు నిన్ గొ
ల్చెదన్, జననీ సర్వజగత్ప్రమోదజననీ జ్ఞాన...

మ. కపురంపు న్విడె మానసంబున సముగ్రస్థాలము
క్తాసరా, సుపమాలంకృతి చన్గవం గటితటి న్హాం

కావ్యరచనాకల్పాత్ములో వారిలోఁ, జలనం బేడ
నసున్ఘటింపఁ గదవే జ్ఞాన... 50

మ. ముద మొప్ప న్మది నిన్నుఁ జేర్చి భయసమ్మోదంబు
లొక్కుమ్మడిం, బొదలం దాఁక పాదుకార్చన
కథాపూతాత్ములై నిత్యని,ర్మలవృత్తి న్భజియించు
వారు చెలువారం గాంతు రిష్టార్థముల్, చదువు
ల్పెక్కులు చిక్క నేమిఫలమో జ్ఞాన... 51

మ. సతతంబు న్దురితావహంబయిన సంసారంబునం
బుత్రమి,త్రతరుణ్యాదివిచారయోగమున నైరం
తర్యదుఃఖక్రియాం, యుతుఁడై చేడ్పడుకన్న
నిన్ను మదిలో నొంగించి నందింపఁగా, జతనం
బైనను జాలు నంచుఁ దలంతుఁగా జ్ఞాన.... 52

మ. క్రతువు ల్నూ ఱొనరించి యింద్రుఁడయి స్వారా
జ్యంబు పాలించి సం, భృతమందారతరుప్రసూన
శుభికాభిస్తుత్యకోటీరకో, టితచేలించి సుధర్మ
నున్నతోఁడు బల్లీవిం ద్వదీయాద్భుత, క్రతుశీలుం
బురుడింపలేఁడు గదవే జ్ఞాన... 53

మ. కమలాధారతు లిర్వురు న్నుతులం గైఁబూన
వేల్పుం గొమల్,క్రమ మొప్పం గొలువంది కట్టె
దుటఁ జొక్కం బైనగీతప్రసం,గము సల్పం గొ
లువున్న నిన్నుఁ గని శక్రాదు ల్భజింతు ర్గదా,
కమలారాతికళాభియాతివదనా జ్ఞాన... 54

మ. చదలాఱ్ఱున్మడి ద్రింగఁగా మనమునం జర్చిం
చుదు న్మించు దు,ర్మద నక్తంచరయోధవీరపృత
నల్రా నారదుం డాట పా,టదలిర్పం గనుఁగోఁగ
దైత్యాలిగాటంబైన తేజంబునం,గదనప్రక్రియ
మింతు రెవ్వ రహహా జ్ఞాన... 55

మ. విశలంబై చకితాత్మమై యసురరాడ్వీరాలిప్రాసా
సిశ,క్తిశరాదిక సాధనవ్రజము భీతి న్బాఱఁ
గా నైచి నే,రక సీచేరువ వచ్చినా మనుదు
దూరం బంటఁగాఁ దోలి తా,సకలామర్త్యనికా
యగేయచరితా జ్ఞాన... 56

శా. హాళి న్నీకు సభక్తికంబుగను సాష్టాంగంబు
లర్పించి యా,శాలీవిశ్రుతపావకీచరితాక్రాంత
శ్రుతి న్మించి య,న్యాలాపంబుల మాని తావక
సమాఖ్యాపాఠముం జేయుచో, జాలం జేటికి
నన్నుఁ బ్రోచుటకు నై జ్ఞాన... 57

శా. నింద ల్సేయుదు రెందఱో ధరణిలో నీరోధదో
షోక్తి నా,నందం బందుదు రెందఱో సుగుణసం
తానంబు లెక్కించి యీ,చందంబు ల్మదిఁ జేర్చ
నీదయ మదాసక్తి న్విజృంభింపఁ ద్వ,చ్ఛందం బెట్టి
దో తెల్పవమ్మ వడిగా జ్ఞాన... 58

శా. ధీరశ్రేణికి మెచ్చు సేయు కవితాస్థేమంబు నేమం

బుతో, రారాజద్గుణ రాజరాజసభల న్రంజిల్ల వా
గ్వైదుషీ, పారావారులు నీకటాక్షమహిమావా
ప్తింగదా ధారుణిన్, స్ఫారఖ్యాతివహింతు రెంత
యును శ్రీజ్ఞాన... 59

మ. జగతి న్నెమ్మది నెన్న మానుషము దుష్ప్రాపంబు
పై నందులోన గణింపందగు నాల్గువర్ణముల
లోనం బుట్టు టబ్రంబు పెంపగుబ్రాహ్మణ్యము
దానిలో నచట పర్యాయంబునన్ జ్ఞానయోగగు
రుత్వంబు భవత్కటాక్షమునవా జ్ఞాన... 60

మ. సమదానేకమతంగజావళియు నాజానేయవా
రంబు నుత్తమరథ్యాళి రథంబులు న్సమరవిద్యా
పాండితీమండితా, సమయోధావళి రత్నకాంచ
నసమంచత్పుత్రదారాదియోగను నీపూజల
భింబునోజ నిజమో జ్ఞాన... 61

మ. భరమా నీకు మదర్థసంఘటనకుంభద్భావసంభూ
తసత్కరుణాపూరతరంగసంగసతతో దంచత్క
టాక్షాంచల, స్ఫురణాపాదన మేల జాల మింక
హెచ్చుం బల్కు లేలా భవ, త్మన్నరణం గల్గని
దేమిగల్గుభువిలో జ్ఞాన... 62

మ. తెలియ న్బ్రాదిల నీమహామహిమ బుద్ధింజూడ
బ్రహ్మాదిది, వ్యులకైన న్నిజమంచు నాగమపద
వ్యక్తు ల్వాంచింపంగ వీనులలో శోకింయుం

గొంతవర్ణనము నేనుం జేయుచుందుం దదా,కల
నాయత్నుఁడ నైతి నీభగమె మా జ్ఞాన... 63

మ. సమయం బిద్దియటంచు నే నెఱిఁగి నీసాన్నిధ్య
ముఁ జెంది నే,నమ్మఁతో సేవయొనర్పఁజాలఁ
గవితామార్గంబునం బ్రౌఢిమం, గ్రమమొప్పం గవి
నాఁడుఁగాను జడుఁ డింక నీవ్యాఁజటంచు న్ననుస్,
సమతం గన్గొని నే ప్రోవఁ గదవే జ్ఞాన... 64

మ. నలుమోముల్గలవేల్పుఁ గన్నదొర యెన్నన్నీకుఁ
దోఁబుట్టుఁ, బల్వల నాశుకృత్తలంగలాఁ దోడయఁ
దేలంజాలు నీవిజ్జగ, మ్ములనానిమ్ముల నిన్నుఁగో
ల్వఁ దలఁపుంబూనం గను శ్లోకము, త్కలికా
మాత్ర మతింతు నన్నుఁ గనవె జ్ఞాన... 65

శా. పొంగట్టు న్వ్యాలుదాల్పుమేన సతియై పాల్పొం
దునిన్నాచియా, బంగారుపట్టపు వేల్పురాణి యిటు
లై పల్వన్నె నవ్వెన్నుమా, త్తం గానంగదె యం
చు ముచ్చట నెడందం జెంద మేల్కొనా,గంగా
జాణతనంబు నూనితిగదా జ్ఞాన... 66

మ. వెలయు న్నీకరుణావిశేషము సదావిఖ్యాతమై
భక్తకో, టులయం దంచుఁదలంచి యొందుఁ బో
రపాటు న్లేక నిర్వ్యాజసే, యలలిం జాలను నీవె
ప్రోవఁదగవా నగ్రస్ఫురద్దాడిమీ, కలికాగుచ్ఛ
సద్భుతకాంతికలితా జ్ఞాన... 67

శా. ఈవేలోకముల న్సృజింప నెలమి న్వైచ్ఛింప
డిండింప న్, త్యావిర్భూతమహాప్రభావయుతవై
యాత్మేశుని న్వాఖ్యలీ, లావిష్టాత్ముని జేయుదం
చు నిగమవ్యక్తోక్తి నేవింటి న, న్నాం జాలవా
కో నమస్మునివరా జ్ఞాన... 68

శా. బంధూకప్రతిమాలికస్థల కనద్భాష్పాక రేఖా జగ
ద్బంధూడుప్రభుకర్ణపూరయుగళీ భాస్వచ్ఛృతీ
సత్కృపా, బంధూరస్థితి నన్నుఁ జూచుచుఁ
గళాపాండిత్యముం బాణిక, ర్కంధూరీతిగ నేర్ప
రింపఁ గదవే జ్ఞాన... 69

మ. తెవి వాక్కింతయు లేనివాఁడని ననుం దీక్షై
చెడం జేయకు, జ్వాలమైనట్టి భనత్కటాక్ష వీక్ష
నాపైఁ బర్వ సర్వంసహా, వలయస్థాఖిలసత్కవీం
ద్రతతిలో వర్ధిష్ణునిం జేయుము, త్కలికావత్క
మలానుతాకృతియుతా జ్ఞాన... 70

మ. చరణార్చాపరభక్తరక్షణపరాసక్తి న్నినుం గొ
ల్వఁగా, నరుదా సంపద లబ్రమా ముదము ల
త్యాశ్చర్యమా పుత్రపా, త్రరమావర్త్వము
చిత్రమా పరజనారబ్ధాంతరాయప్రతీ, కరణం
బంబుజగర్భసన్నుతపదా జ్ఞాన... 71

మ. ధరణి న్నిశ్చలమైన నీకరుణ నిర్దంభోదితం బైన
య, ప్పరమాహ్లాదవినోది గాంచు నియతప్రఖ్యా

తి నీతిక్రమ, స్థిరతం బ్రాజ్ఞ్యసమస్తసూపదలవృద్ధిం
బుద్ధియోగోల్లస, త్పరసానందకవిత్వసంపదయా
శ్రీజ్ఞాన... 72

శా. శ్రీచక్రార్చన సేయుచు న్వ్రతతపస్సిమస్థిరతోద్యద
యు, ప్రాదుర్యప్రథమానభక్తినియతప్రజ్ఞావిశే
షం బటుల్, వాచామాధురి నీదునామపఠన
వ్యాకోచకావ్యక్రియా, సాచివ్యంబును గాం
చు మందుఁ డయినన్ జ్ఞాన... 73

మ. కలికాలం బిది దీనియం దొకఁ డనేకప్రక్రియా
యుక్తిని, శ్చలభక్తి న్నినుఁ గొల్వలేఁడు జనుఁ
డాశాయోగమా మెందుఁ దో, వ లనేకంబులు
విఘ్నరోగములకుం బాటిల్లు నీభక్తిలోఁ, గలు
గం జేయఁగ నీవదిక్కు గదవే జ్ఞాన... 74

మ. అలసత్వం బధికంబు గ్రంథములు పర్యాయంబునం
జూడఁగాఁ, గలనా లెక్కకు రాని వెల్లువునఁ జ
క్కం జేసి చూడంగ నం, దలి తాత్పర్యము దుర్ల
భం బనుచుఁ గానంబాలకున్నాఁడఁ ద్వత్కలి
తానుగ్రహ మొక్కఁడుండఁ గొఱఁతా జ్ఞాన...

మ. గలు త్రైయిఁ ద్వదీయసత్కరుణకై భావించిన
సేవించెదం, దగ ని న్నిట్టిది చూచి నీఁడు మద
నుధ్యానైకతాత్పర్యని, ష్ఠగలాఁడంచు మదిం ద

లంచి కరుణాసాంతత్యసంబంధస, జ్జగతిం బ్రోవఁ
గ రావిదేమి యకటా జ్ఞాన.... 76

మ. కలి నంతంతకు ధర్మకర్మపథసంస్కారంబు మా
సె న్మహా, బలవంతంబయి కానిపించె నహహా
మాన్యావమానక్రియా, కలనల్ నీకరుణాకటా
క్షమున విక్కాలంబు దోలందగుం, జలనం బిం
తయుఁ జెందకుండ జననీ జ్ఞాన... 77

మ. ప్రియము ల్వాల్కిన నప్రియంబులని సంప్రీతి
న్వగ జెందకే, మయినం జూచుచు నీయనుగ్ర
హముఁగా నాంతర్యమం దెంచుచు, న్భయ మెం
క్కింతయు లేక నిన్ను మదిలో భావింపఁగా బుద్ధిని
శ్చయ మి మ్మోజననీహితార్థజననీ జ్ఞాన... 78

మ. సరసాలాపవిలాస హాసరచనాచాతుర్యసుస్థైర్య
భా, స్వరదివ్యస్వరరీతిసంతతతతవ్యాసంగదివ్యాం
గనా, పరిపాటీగణనావినోదవిలసద్భవ్యాదరో
ద్యత్కీనతా, చరణాంభోజనతామరవ్రజహితా
జ్ఞాన... 79

మ. స్ఫుటతారానికరస్ఫురద్రుచిమణీ శోభాంక
హారావలీ, ఘటితోత్తుంగకుచద్వయోపరిలస
త్కంజాతనాగారుణో,ద్భటకూర్పాసవిభాసమా
నకురువిందశ్రేణి కాప్రోల్లస, త్కటకాలంకృతపాద
పద్మయుగలీ జ్ఞాన... 80

ప్రశస్తం బైన నీసత్కృపం, గడువంత ల్దొలఁగింప
వమ్మ జననీ జ్ఞాన... 85

శా. చింతారత్ననివాసవాసరసికా శ్రీపుర్యుదారాసి
కాశాంతాత్మాంతరసీమసాధువసతీ శ్యామాభిరా
మద్యుతీ, సంతాపాపహృతిప్రవీణచరణా శత్రుచ్ఛి
దాకృద్రణా, స్వాంతాంతర్విలగజ్జగత్పటలికా జ్ఞాన.

మ. చెడుమార్గం బని యించుకైన మదిలోఁ జింతిం
పకే నెప్పుడున్, విడనాడందగు చెయ్వులన్ని
యును నువ్విళ్లూరుచుం జేసితిం, బొడగానంబడు
పారతి న్మదిని దప్పుల్మూడ కొక్కమ్మడిన్, గడ
కంటం గని ప్రోవుమమ్మ దయతో జ్ఞాన... 87

మ. స్ఫుటమై నీకరుణారసం బెవనిపై సోఁకు న్వసన్
ధాత్రివాఁ, డటవీవీథుల శత్రుమధ్యమున నుగ్ర
ద్వారిపూరాంతరో, త్కటవీథీనిచయంబునం బడి
న వేగం బ్రోతువా నీవె ధూ, ర్జటివామాంగనివా
సభాసురతనూ జ్ఞాన... 88

మ. నవకావ్యంబు రచించి ప్రాజ్ఞులును నానావృత్త్య
లంకారరీ, తివిశేషంబుల మెచ్చువచ్చునటు లుద్దీ
పింపఁగా నర్థనం, భవసారస్యముఁ దెల్పలే రిపు
డు నామాటంత యొక్కింతనా, కవితం గైకొను
మమ్మ యెట్టులయినన్ జ్ఞాన... 89

మ. తపముం జేయుచు నీమనంబునకు సాంతత్యంబు

యతవ్యాపారరంభాదిలా, స్వవిలాసోన్నతిదర్శ
నాద్రుతిమతీ జ్ఞాన... 94

మ. దయ యొక్కించుక నాపయి న్నిలిపి నీదాసుండ
నౌనన్ను ని, ర్భయునిం జేసి సమస్తకార్యములు
నభ్రంబైనసాఫల్యమూ,న్చి యసన్మార్గ్రశ మైన
తెల్వి దయతో నీఁజాలు దీవేకదా, జయసమ్మో
దితదేవతాపటలికా జ్ఞాన... 95

శా. పంచాస్యంబు హయంబుగా సముదసంప్రాప్తాసు
రవ్రాతముల్, గొంచెం బైనను జిక్కనీక దును
మం గోదండపాండిత్యలీ,లాంచత్పాణివిలాసవై
తనరు నీయభ్రంపుశక్తి న్సని, సంచారాంచిత
శక్తిసేన లెఱుఁగుల్ జ్ఞాన... 96

మ. కమలాదేశకృదాయతాక్షియుగళీ కల్యాణభూ
భృద్రుచి, క్రమనిర్మోటనపాటవోరసిజయోగ శ్రీ
సమేతావదా,తమణీహారవిరాజమానగళ విభ్రా
మధ్యమా పూర్ణిమా, కమనీయేందువిభాసమా
నవదనా జ్ఞాన... 97

మ. కలరా వేల్పులు నీకు సాటి యనఁగాఁ గన్గొఁ
గ లే రేల ప, ల్కులు నీవే ననుఁ బ్రోవఁగావలె
దౌసంగు ల్బాఱఁగాఁ దోలి నా, పలన స్నేరము
లున్న నీమదిని జేర్పంబోక రక్షింపుమీ, జలజా
తప్రభవాంగనాదివినుతా జ్ఞాన... 98

# పీఠిక.

ముకుందశతకము వ్రాసినకవి దూపాటి తిరుమలాచార్యులు. ఇతఁడు లోహితసగోత్రుఁడు. దూపాటికొండమాచార్యులు రంగనాయకమ్మలకు జ్యేష్ఠకుమారుఁడు. తిరుమల సింగరాచార్యగురువర్యుని శిష్యుఁడు. ఈకవి సంస్కృతాంధ్రములందుఁ దనజనకునివద్ద విద్యార్థిగ నిరర్గళపాండిత్యము నార్జించి కవితారచనమున మిగులఁ బ్రతిభఁగాంచెను. ఈకవి రావిపాటి రామశతకమను పేరుతో రామాయణకథ నంతయు సీసపద్యములు 108 లో నిమిడించి వేఱొకశతకము వ్రాసియున్నాఁడు. ముకుందశతకమునందలికవిత చిత్రమగుగమనికలతో మనోహరముగా నున్నది. ప్రతిపద్య మొకవిశేషముతోఁగూడి శ్రావ్యమగు నడకతో వీనులకు విందుఁగొలుపుచున్నది. కవితలో లాక్షణికవిరుద్ధములగు లోపములు గానరావు.

ఈకవి నివాసస్థానము బాపట్లకు పదిమైళ్ల దూరమున సముద్రతీరమునందున్న ఓడరేవు. చిరకాలమీకవి యటనుండి వయస్సుదీరినపిదపఁ దన యెనుబదవయేడు పరమపదవిచేరెను. ఈకవి సోదరుఁడగు శేషాచార్యకవి ప్రౌఢకవి. ఈయన రంగధాము, నరసి

కంటి నృసింహాదిశతకములు, శకుంతలా ధనంజయవిలాసాదిగేయప్రబంధములు వ్రాసినాఁడు. మాపితామహులగు శేషాచార్యులకీ తిరుమలాచార్యకవి యగ్రజాతుఁ డగుటచేత మే మీకవిజీవితము నీవిధముగాఁ దెలుపఁగలిగితిమి. కవిగారి మనుమ లిపుడు ఓడరేవులో నివసించియున్నారు. ఇంక నటనేమైని పుస్తకము లుండెనేమో విచారింపవలసియున్నది.

ఈకవి గతించి యిప్పటికి ముప్పదిసంవత్సరములు దాటినవి. తిరుమలాచార్యుఁడు స్ఫురద్రూపి యనియు ఆజానుబాహుఁడనియు సంగీతసాహిత్యవిద్యాకుశలుఁడని మా పెద్దవాండ్రు చెప్పుచున్నారు. శతక వాఙ్మయములో నెన్నఁదగిన వానిలో నీముకుంద శతక మొకటిగ నున్నది.

నందిగామ. 5-2-25 } ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దూపాటి తిరుమలాచార్యప్రణీత

# ము కుం ద శ త క ము.



## అంత్యనియమపద్యములు.

క. శ్రీకర లక్ష్మీచిత్తవ
శీకర సద్గుణజితాబ్ధిశీకర కారు
ణ్యాకర తేజోవిజితవి
భాకర దాక్షిణ్యయుక్తభావ ముకుందా. 1

క. బందీకృతసురబృందా
మందస్మితవిజితకుంద మహితానందా
సుందరతనుజితకందా
నందితముచికుంద నతసనంద ముకుందా. 2

క. దనుజసముదాయశిక్షా
సనకాదిమునీంద్రపక్ష సజ్జనరక్షా
వనజభవాండాధ్యక్షా
వనరుహపత్త్రాక్ష విపులవక్ష ముకుందా. 3

క. మానవపావనరామా
మానేషుశతాభిరామ సుగుణస్తోమా

మానిజనహృదయధామా
దానవజనభీమ కురుమదాము ముకుందా. 4

క. పావనజనుతపరితోషా
నవనీతమునయపోష వత్సఖరతవిభూషా
భువనవనోహరవేషా
భవజలనిధిశోష మధురభాష ముకుందా. 5

క. శతపత్రసత్రనేత్రా
శతధృతిసన్నుతచరిత్ర శశినిభగాత్రా
శతకోటివదనగాత్రా
శతకోటిధరారినివహశత్రు ముకుందా. 6

క. సురుచిరకౌస్తుభహారా
శరనిధిగంభీరధీమ సద్గుణశూరా
మురరిపువిపినకుఠారా
సురమునిమానససరోజమధుప ముకుందా.

క. పరమమునిహృదయశరణా
పరిపాలితదేవచరణ భవభయహరణా
సురుచిరరత్నాభరణా
శరణాగతభరణ కమలచరణ ముకుందా.

క. బృందారకరిపుకదనా
వందారుబుధాలిహృదయవనరుహసదనా
కుందముకుళాభరదనా
మందస్మితవదన మదనమదన ముకుందా. 9

క. సవినయవినతతనూజా
సువదనజితరాజ ధరణిసురసురభూజా
కవినుతపాదసరోజా
రవిశతశతతేజ దైవరాజ ముకుందా. 10

క. పశుపతివిదితవిలాసా
విశదాబ్జవికాస హాసవిద్యుద్వాసా
దశరథరాజోల్లాసా
దశవదననిరాస ముదితదాస ముకుందా. 11

క. కమనీయాంబుధరాంగా
కమలాహృత్కమలభృంగ ఖగపతురంగా
విమలాంతరంగ దానవ
సముదాయవిభంగ మానిసంగ ముకుందా. 12

క. గగనమణిసుప్రతాపా
నిగమాంతోల్లసితరూప నిత్యశ్రీపా
అగణిత సుగుణకలాపా
జగదవనధృతోగ్రరూపచాప ముకుందా.

క. అనుదినరక్షితదీనా
సనకాదిమహామునీంద్రసంఘాధీనా
కనకోజ్జ్వలపరిధానా
దనుజారణ్యానలాభిధాన ముకుందా. 14

క. ద్యుమణికరోల్లసితాంబుజ
రమణీయముఖప్రభావరాజితచంద్రా

డమరేంద్రకర్బురానిల
శమనాదిసుపర్వవినుతచరిత ముకుందా. 20
క. హీరాబ్జరాగమౌక్తిక
చారుమణీప్రకరతప్తజాంబూనదకే
యూరమకుటాంగులీయక
హారాదివిభూషభూషితాంగా ముకుందా. 21

శ్లోకరూపపద్యములు.

క. రామం రావణదనుజని
రామం జనకాత్మజాభిరామం సుజనా
రామం వంచితభార్గవ
రామం త్వాం హృది సదా స్మరామి ముకుందా.
క. శాంతం సన్మునిహృదయని
శాంతం పద్మజభవాదిసంస్తుతిభాజా
శాంతం స్థాపితసుజనా
శాంతం త్వాం హృది సదా భజామి ముకుందా.
క. కాండావాస పిచండా
కాండోద్భవ కాండరూప ఖగసంతతిరా
ట్కాండమహాహవ సునిశిత
కాండ విదారితనిశాటకాండా ముకుందా. 24
క. గోమద్గోరుహగోముగ
గోమర్దితదనుజజాల గోకులపాలా

గమఠాకృతి మందరగిరి
సమధికత వహింపలేదె సదయముకుందా. 80

క. ధరణీమండలమెల్లను
సురలద్భుతమందఁ జాఁపచుట్టినగతి దాఁ
బరగించిన హేమాక్షుని
హరియింపఁగలేదె వంప్రియగుచు ముకుందా. 81

క. డింభకవిద్వేషినిగని
స్తంభమున నృసింహాలీలఁ దాల్చి తునుమ వే
అంభోరుహాసంభవభవ
జంభాంతకముఖులు వినుతిసలుప ముకుందా. 82

క. బలిదైత్యుని మూఁడడుగులు
బలిమిని భూదానమడిగి ప్రాబల్యమునన్
జలజభవాండము రెండడు
గులు గొలునవె వటుండవై వికుంఠ ముకుందా.

క. పరశువు గైకొని నృపులను
దురమున ముయ్యేడుసార్లు దునుమాడి యశం
బరుదుగ జగములునిండఁగఁ
బరపవె భార్గవుఁడవగుచుఁ బరమముకుందా. 84

క. దశరథునకుఁ బుత్త్రుఁడవై
దశవదనముఖోగ్రదైత్యతతి నణఁచినసీ
యశమును గొనియాడఁగ న
దశశతవదనునకునైనఁ దరమె ముకుందా. 85

క. ముసలహాలంబును గైకొని
వసుధం గలదుష్టదైత్యవర్గము నెల్లన్
గసిమసఁగఁజేసి త్రుంచవె
రసికులు కీర్తింపఁగ బలరామ ముకుందా. 36

క. కాంచి చతుర్ముఖషణ్ముఖ
పంచముఖసహస్రముఖులు భక్తిమెయిం గీ
ర్తించఁగ మెలఁగెదునినుసే
వించెద గోపాలకృష్ణవేష ముకుందా. 37

క. శుద్ధాత్మలఁ ద్రిపురాసుర
శుద్ధాంతాంగనలవ్రతము చూఱలుగొనవే
బౌద్ధావతారమున సుర
సిద్ధాదులుపొగడ భక్తసేవ్య ముకుందా. 38

క. కలికిమహారూపుఁడవై
ఖలులగు మ్లేచ్ఛులనుదునిమి కారుణ్యమునన్
గలిదోష మడఁతువౌగద
సలలితఘననీల సుగుణజాల ముకుందా. 39

క. దశరూపములను బూని త్రి
దశులు నమోనమ యటంచుఁ దద్వేళల నీ
యశముఁ గొనియాడఁగా దు
ర్దశలను బాపుదువుగాదె దయను ముకుందా. 40

## దశమస్కంధపూర్వోత్తరభాగ కథాసూచకపద్యములు.

క. వసుదేవుఁడు దేవకియును
వసుదేవముఖుల్ నుతింప వాత్సల్యమునన్
వసుమతి నినుబుత్త్రునిగాఁ
గుసుమాయుధరూప కనరె కోరి ముకుందా. 41

క. నందయశోదామిథునము
నందనుఁడవటంచు నిన్ను నమ్మియుఁ బరమా
నందాబ్ధిమగ్నమై లోఁ
జెందినప్రేమాతిశయముచేత ముకుందా. 42

క. కృష్ణాష్టమియం దిలపై
కృష్ణాఖ్యను జననమొంది కితవతతిని వ
ర్ధిష్ణుఁడవై తునిమితివౌ
యుష్ణాంశునికాశ తేజమొప్ప ముకుందా. 43

క. సుజనచకోరము లలరఁగఁ
గుజనాంభోజాతతతి ముకుళతవహింపన్
ద్విజరాజవంశశరధికి
ద్విజరాజవు కావె దివిజవినుత ముకుందా. 44

క. కలుషధ్వాంతము విరియఁగ
విలసితపుణ్యాంబుజములు వికసిల్లఁగ భూ
తలమున శ్రీకృష్ణాఖ్యను
జలజాప్తునివిధముగొనవె సదయ ముకుందా. 45

క. నీచిన్నారికరంబులు
నీచారుపదాంబుజములు నీచిఱునగవుల్
నీచక్కఁదనము పొడఁగని
వాచస్పతికైనఁ బొగడవశమె ముకుందా. 46

క. రాజిలుచు నిన్ను గోపక
రాజాస్యలు శయ్యనునిచి రాగముతోడన్
జోజోయని పాడుదురఁట
రాజీవదళాక్ష లోకరక్ష ముకుందా. 47

క. రుచిరాకారముచే విష
కుచయగురక్కసినిబట్టి కూల్చితివఁట నీ
ప్రచురప్రభావములు సుర
నిచయముగొనియాడ శరదనీల ముకుందా. 48

క. నిండిన తేజము గదురఁగఁ
జండోగ్రనికాశకోపసంయుక్తుఁడవై
బండినిగూల్చితివా నీ
దండితనం బెన్న నెవరితరము ముకుందా. 49

క. సల్లలితమృదులకరపద
పల్లవములు దగుల నెలమి పాల్ద్రావుతఱిన్
ముల్లోకంబులు ముఖమునఁ
దల్లికిఁ గనఁబఱుపలేదె దయను ముకుందా. 50

క. చక్రానిలదనుజుఁడు నిను
విక్రమమునఁ గొనుచు గగనవీథిజనుతఱిన్

శక్రాదులు గొనియాడ న
వక్రతఁ గూల్చితివి భక్తవరద ముకుందా. 51

క. పలుకుల నమృతరసంబులు
చిలుకఁగఁ బాదాంబుజములఁ జిఱుగజ్జెలు ఘల్
ఘలుఘలుమని మ్రోవఁగ గం
తులువైవవె శైశవంబుదోఁప ముకుందా. 52

క. పన్నగరాజునకైనను
సన్నుతిజేయంగరానిజన్మంబుల నీ
కెన్నఁడు తృప్తియు లేదఁట
వెన్నలు మ్రుచ్చిలుట లెంతవింత ముకుందా. 53

క. వాత్సల్యముతోడను గో
వత్సములను మేపుచుండి ప్రబలత మెఱయన్
వత్సాసురుఁ దునుమవె శ్రీ
వత్సాంకితవక్ష సుజనపక్ష ముకుందా. 54

క. ఒకకొండరీతిగ భయా
నకరూపముదాల్చి తిరుగు నానాగతులం
బకదైత్యుని దునిమితివా
సకలాశ్రితజాల దివిజసాల ముకుందా. 55

క. ఖరుఁడఘదైత్యాధముఁడజ
గరగతిమార్గమున కెదురుఁగా నిలువఁగ భీ
కరకరములఁ జీల్పవె చూ
పరు లద్భుతమొంద భక్తపాల ముకుందా. 56

క. కాళియఫణిఫణములపై
హేలాగతి పాదచిహ్నాలేర్పడ నటనన్
వాలాయముగ నొనర్చవె
జాలిం దత్సతులు నుతులు సలుప ముకుందా. 57

క. వత్సార్భకతతి నజుఁడతి
కుత్సితమతియగుచు నొక్కగుహానిడి చన త
ద్వత్సరము తత్తదాకృతి
వత్సలతవహింపలేదె వరద ముకుందా. 58

క. నతుఁడై భయభక్తుల నా
చతురాననుఁ డప్రమేయసౌందర్యశ్రీ
యుతతావకరూపముగని
స్తుతులొనరింపంగలేదా సొలసి ముకుందా. 59

క. యమునాజలములఁ దోఁగెడి
కమలాస్యలహాస్యమెసఁగఁ గన్గొని తచ్చే
లములఁగొని మరలనీయవె
విమలాత్మకలగుచు నిన్ను వేఁడ ముకుందా. 60

క. సురపతి కోపాన్వితుఁడై
పరుషోపలవృష్టి వ్రజముపైఁ గురియుతఱిన్
వెఱవకుఁడని గోవర్ధన
గిరియెత్తవె యొక్కలీలఁ గేల ముకుందా. 61

క. మానితయమునాతటభూ
కాననమున గోగణంబుఁ గాచుచు మురళీ

గానమొనర్పఁగ నిను వ్రజ
మానవతుల్ గోరలేదె మదిని ముకుందా. 62

క. బృందావనమున గోపక
సుందరులను రాసకేళి సొక్కించి మహా
నందమునఁ గూడియాడవె
బృందారకు లలర సుగుణబృంద ముకుందా. 63

క. ముజ్జగములు కుదురుగ బల్
బొజ్జన ధరియించునిన్నుఁ బొలుపుగ వ్రజయో
షిజ్జనము వలచె మోహక
మజ్జనమున విటుఁడవనుచు మమత ముకుందా.

క. ఇరుగడలను గోపికలును
పరగఁగ మధ్యమున నుభయపార్శ్వంబుల నీ
వరుదుగ నిలువవె మండల
సరణిన్ రాసోత్సవంబు సలిపి ముకుందా. 65

క. ముద్దులుగులికెడుపలుకుల
వద్దికను భ్రమించి గోపవనితామణు లే
ప్రొద్దు నినుగూడుదురుగద
సద్దివిజమునీంద్ర దేవసాల ముకుందా. 66

క. పరిపరివిధముల మెలఁగుచు
దురమున వృషశంఖచూడతురగాసురులన్
బరిమార్చి దుష్టనిగ్రహ
మరుదుగ నొనరింపలేదె హరి ముకుందా. 67

క. వక్రాత్ముండగు కంసుం
డక్రూరునిగాంచి యోమహాత్మ చని మహా
విక్రములగు బలకృష్ణుల
నక్రూరత్వమునఁ బిలువుమనఁడె ముకుందా. 68

క. వచ్చిన యక్రూరునిగని
విచ్చేసె మహాత్ముఁడనుచు వేడ్కదలిర్పన్
బొచ్చెములేని సపర్యల
హెచ్చుగఁజేసితివిగాదె యెలమి ముకుందా. 69

క. స్యందనమునఁ దోలుతను గా
ళిందీజలములను నీదులీలాకృతి కా
నందింపఁడె యక్రూరుఁడు
వందనములొనర్చి దాసవరద ముకుందా. 70

క. మధురాపట్టణసురుచిర
మధురాధర లపుడు నీదుమదనాకృతియున్
మధురాలాపంబులు బహు
విధములఁ గొనియాడలేదె వేడ్క ముకుందా.

క. కంసముఖదుష్టభూపన్ను
శంసుల చక్రాదిదివ్యసాధనములచే
హంసతురగుండు మేలన
హింసింపఁగలేదె జగములెన్న ముకుందా. 72

క. జననీజనకులఁ గనుఁగొని
వినయమున నమస్కరించి విపులాహ్లాదం

బోనరించి యుగ్రసేనుని
జననాథుని జేయలేదె సదయ ముకుందా. 73

క. బృందారకగురుసముఁడగు
సాందీపునివలన వేదశాస్త్రంబుల నా
నందమున నేర్చి గురునకు
నందనునొసఁగవె భళీ! యనంగ ముకుందా. 74

క. రసికవరముతోడ గోపక
వనితల నోదార్చుకొఱకు వాత్సల్యమునన్
బనుపవె యుద్ధవు వ్రజమున
కనవరతదయాంబురాశివగుచు ముకుందా. 75

అష్టభార్యలవివాహము.

క. క్రూరులగు చైద్యముఖనృప
వీరులను నిరాకరించి విశ్వజననియౌ
శ్రీరుక్మిణీసతీమణి
నారూఢిపరిగ్రహించి తౌర ముకుందా. 76

క. జాంబూనదరుచిరాంగియుఁ
గంబుగ్రీవయును విశాలకమలాక్షియు నా
జాంబవతిం గైకొనవే
యంబుజశరకోటిసుందరాంగ ముకుందా. 77

క. సత్రాజిత్తుఁడు తనప్రియ
పుత్రికయగు సత్య నెలమి పూజించుచు స

క. షోడశసహస్రరమణుల
వేడుకఁ బరిణయమునొంది వివిధాకృతులన్
గూడి పరమాద్భుతంబుగఁ
గ్రీడింపవె నరకదనుజు గెలిచి ముకుందా. 84

క. పతిశుశ్రూషాపరులగు
సతులను సేసుదయమ్మైన సవినయశౌర్యా
న్వ్రతులగు సుతులఁగనింపఁగ
శతధృతికోర్వలదు వశమె సదయ ముకుందా. 85

క. శిశుపాలవంశవర్తుల
నిశితసుదర్శనము చేత నిర్జించి వెసన్
యశము జగంబులు నిండఁగ
విశద మొనర్చితివి వేదవేద్య ముకుందా. 86

క. అటుకులు కుచేలుఁ డొసఁగఁగఁ
బటుకరుణ భక్షించి లోకతతిఁ దనియ స
త్పటుతరసంపదలొసఁగితి
నట నీదాసత్వమెన్న నరుదు ముకుందా. 87

క. నిను ద్రౌపది కౌరవసభ
ఘనపరిభవమొంది కృష్ణ గావుమటన్నన్
గనికరముతోడ వలువలు
మనియ యక్షయపటము లొసఁగితౌర ముకుందా.

క. నతుఁడై బహుతరదైన్యా
న్వితుఁడై భూసురుఁడు నిన్ను వేఁడిన గృపమున్

మృతులై నసుతులఁ గ్రమ్మఱ
బ్రతికించి యొసంగితౌర పరమముకుందా. 89
క. శ్రుతులు నిను మాగధులు భూ
పతి నెటుగీర్తింతు రటులఁ బటుతరభక్తిన్
నుతులొనరింపవె సతతము
చతురాననవినుతపాదజలజ ముకుందా. 90

షోడశోపచారపూజ.

క. ధ్యానమొనర్చెద మామక
మానసకంజాతపీఠమధ్యంబున నీ
సూనశరమృదుపదంబులు
మానసమున నిల్పి శ్రీరమాప ముకుందా. 91
క. ఆవాహన మొనరించెద
శ్రీవనితారమణిఁ గూడి చెలువారంగా
వేవేగ రమ్ము మామక
సేవకుఁడని కనికరంబు చేత ముకుందా. 92
క. భాసురకాంచనమణిసిం
హాసన మొసఁగెదను బంకజాక్షకృపను నీ
వాసీనుఁడవై శ్రోవ్రము
శ్రీసతితోఁ గూడి గంధురీణ ముకుందా. 93
క. ముదమున నర్ఘ్య మొసంగెద
సదయుండవై గొనుము దివిజసన్నుతచరితా

విదురముఖభక్తవరదా
మదనశరోల్లసితరూపమహిత ముకుందా. 94

క. విద్యాధరముఖసురనుతి
వేద్య కృపారసనివేశ విశ్వేశ్వర శ్రీ
విద్యోతనగై కొను మిది
పాద్యం బొసఁగెదను భక్తపాల ముకుందా. 95

క. నాచిత్తంబుజపీఠిని
నీదక్కనివిగ్రహంబు నిల్పి నతుఁడనై
యాచమనీయం బొసఁగెద
వాచస్పతివినుతగొనుము వరద ముకుందా. 96

క. అభయప్రద జగదద్భుత
విభవసమస్తాగమాంతవేద్య రమేశా
ఇభరాజవరద గైకొను
మభిషేక మొనర్చెదను కృపాబ్ధి ముకుందా. 97

క. సీతారమణీకళత్రా
శీతాంశుఖరాంశునేత్ర చిత్రచరిత్రా
పీతాంబర మొసఁగెదఁ గొను
చేతోమోదాతిశయము చేత ముకుందా. 98

క. కందర్పసదృశవిగ్రహా
మందరసముధైర్య సంకుమదకలితశ్రీ
చందనములఁ దెచ్చఁ గైకొను
మందముగా మానసాబ్జ మలర ముకుందా. 99

క. మొల్లల జాజులఁ బొగడల
మల్లెలఁ జేమంతిపూల మరువక తులసీ
పల్లవముల సంపెంగల
ఫుల్లాంభోజములసేతు పూజ ముకుందా. 100

క. ధూప మొనర్చెద సర్వ
వ్యాపక పద్మాక్ష గరుడవాహన ధర్మ
స్థాపక లక్ష్మీనాయక
గోపాలస్వామి కృపను గొనుము ముకుందా.

క. శ్రీరాజనం బొనర్చెదఁ
గారుణ్యాకరరమేశ గైకొనుపారా
వార గభీరపరాత్పర
సూరిజనావనశమాదిసుగుణ ముకుందా. 102

క. క్షీరాన్నము దధ్యోదన
మారూఢిగ వడలు సుఖియ లతిరసములు నిం
పార పులిహోర పొంగలి
కూరిమి నర్పింతుఁ గృపను గొమ్ము ముకుందా.

క. ఏలాలవంగవరహిమ
వాలుకసత్క్రముకచూర్ణ వర్ణితమగు తాం
బూలమొసంగెదఁ గైకొను
శ్రీలలనారమణ మృదులశీల ముకుందా. 104

క. అంగీకరించి కృప ను
ప్పొంగుచు నొసఁగెదను మంత్రపుష్పము విద్వ

# పీఠిక.

శివశతకము వ్రాసినకవినామము తెలుపుపద్యములు మేము ప్రత్యంతరము వ్రాసికొన్నమాతృకలో లేవు. మాకుఁ జిక్కినప్రతి యొక్కటియే యగుటవలనను నూటయెనిమిదిపద్యములకు నందింకఁ గొన్ని కొఱంతపడియుండుటవలనను ప్రత్యంతరసహాయము లేకుంటవలనను రచయితను నిర్ణయింప వీలులేకపోయినది. శతకకర్త పద్యములలోనివిషయములను బట్టిచూడ వీరశైవుఁడని తోఁచుచున్నది. చెన్నబసవఁడు, బసవేశ్వరుఁడు, శివనాగుమయ్య, నిమ్మవ్వ, ధూర్జటి, ఉద్భటారాధ్యుఁడు లోనగువీరశైవుల నీకవిస్తుతించుట యీయూహకుఁ దార్కాణముగా నున్నది. కవి వీరశైవుఁడని నిరూపింప వీలు చిక్కినది. కవికాలమును గుఱించి ప్రయత్నింపనొకస్వల్పావకాశ మీశతకమునఁ గలదు.

ఈశతకమున రచయిత వీరశైవులగు శివభక్తుల ప్రభావముల నెన్నుచు ఆంధ్రకవులలో నగ్రేసరుఁడగు ధూర్జటికవి నిటులఁ బ్రశంసించినాఁడు.